

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీ బృహద్వాసిష్ఠ సిద్ధాంత నిస్త్రైగుణ్య

# ద్వాదశీ-షోడశీ-పంచదశీ-ఇత్యాది

# మంత్రాక్షర కల్పిత చక్రము.

చక్ర తాత్పర్యార్థ సహితము



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# శ్రీ బ్రహద్వాసిష్ఠ సిద్ధాంత నిస్త్రైగుణ్య

# ద్వాదశీ-షోడశీ-పంచదశీ-ఇత్యాది

# మంత్రాక్షర కల్పిత చక్రము.

చక్ర తాత్పర్యార్థ సహితము

ఓం

వందనములు.

ప్రణవాతీతాయనమః.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

మహాఋషి సేవితాయనమః.

గురుచరణం భవహరణం.

సర్వశ్రీనిజగురు చరణారవిందార్పణమస్తు

శ్లో॥ యోసా వాసార సంసార పారావార పరాఙ్ముఖమ్.
తమ్ వందేవృద్ధ కానద్ధమ్ నరసింహ్వా చలదేశికం.

శ్లో॥ మమ మాతా పితాచైవ పుత్రసంతాన కాంక్షయా,
గత్వాముని కొలన్నామ. తపోవనవనుత్తమం॥

శ్లో॥ తప్వాతప స్తతో జాత స్తనయోహంపితాతదా,
మాం ముని స్వామి నామానం చకారా నందచేతసా.

శ్లో॥ అహంత్వ్ తస్తతోగత్వా గురుమ్ పరమ ధార్మికమ్.
లక్ష్మీనృసింహ నామానం, సూత్రాత్మ్వచన బోధయా.

శ్లో॥ సర్వదోషగుణా తీతాన్, నిర్మలత్వంత శాంతిః.
కృతార్థోస్మి పరమగురు తస్మైశ్రీగురు వేనమః.

శ్లో॥ జ్ఞానా జ్ఞాన స్వరూపాత్మ జ్ఞానా జ్ఞానవివర్జితః.
క్షరాక్షర స్వరూపాత్మ క్షరాక్షర వివర్జితః.

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్.
నాదబిందు కళాతీతం, తస్మైశ్రీగుర వేన్నమః.

ఓం
ప్రణవాతీతాయనమః.
గురుచరణం-భవహరణం.
శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.
వందనములు.

ఏతత్సర్వం శ్రీ నిజగురు చరణారవిందార్పణమస్తు.

ఆర్యులారా!

ఇయ్యాది, శ్రీమద్గోవిందవఝ్ఝల వెంకట్రామాచల గురు సార్వభౌముల ప్రియ శిష్యుండగు శ్రీమద్వొంపటి లక్ష్మీ నరసింహస్వామి దేశిక ప్రభువులు. మహాపవిత్రమైన ధర్మమును శ్రీసద్గురు నాజ్ఞప్రకారము, ఆశ్రమమును స్థాపింపదలంచి, అయ్యాది, కాలపవిత్రత, దేశపవిత్రత, తీరపవిత్రతను చక్కగా తిలకించి, రాజమండ్రి, ఆల్ కట్ తోట గోదావరినది ఒడ్డున నిర్మింప దలంచెను. మహర్షులందరు తపస్సు చేశిన మహాతీరమును, శ్రీసద్గురుమూర్తి అంగీకరించి, క్షేత్రమును తీరమును, యిరువైపుల పవిత్రతగావించి, శ్రీమద్వొంపటిలక్ష్మీ నరసింహ దేశిక ప్రభువులు, తన గురుమూర్తిని హృదయమందిడికొని, శ్రీ వెంకట్రామాచలాశ్రమమను నామమును. 6-1-1939 నందు స్థాపించిరి. అయ్యాది మొదలు సద్భక్తవరులెందరనో శాంతినొందించి తరింప జేశిన పరమగురుమూర్తి శ్రీసద్గురుపుత్రులెల్లరకు, ఆచరణయోగ్యాను సాంప్రదాయముగా తరించుటకు శ్రీసద్గురు పాదుకాపీఠమును స్థాపించిరి. దేశికేంద్రప్రభువులైన, శ్రీమద్వొంపటి లక్ష్మీనరసింహ గురు సార్వభౌములు. శ్రీ చక్రమను దేహమును సంపూర్ణముగా వదలి ఏతత్చక్రమునుండి బయలైవున్నది వున్నట్లుగా భక్తాదు

లందరికీ (1956, ఆశ్వయుజ శుద్ధచవితియందున:) దర్శన మొసంగిరి॥ వారు, వారి గురుమూర్తినామమున ఆశ్రమము నిర్మించిన కారణము, జన్మరాహిత్యమును గోరుజ్ఞానము, జ్ఞానాతీతమును బొందవలయునన్న శ్రీసద్గురు మూర్తిని జేరి తేనే జ్ఞానమునకు జ్ఞానాతీతముప్రాప్తించునను స్థిరత్వమే గురు పుత్రులందరికి అవలోకనము కలుగునను పాఠము. ఆ సూత్ర సూచనము॥ తదుపరి: ఆర్యులున్న కాలమందు, ఆశ్రమమం తయు, వర్షమునకు వర్షించుచుతూ, శిథిలావస్థలోయున్న ఆవర ణము సంపూర్ణముగా యూవత్తూ, పునర్నిర్మాణముచేయించి. భక్తాదులకు యేలాంటి సంశయము భయమునకు లోనుగా కుండా, భక్తాదులొసంగిన పూర్ణభక్తి విరాళములను యావత్తు యిత్తడి రేకులయందు, శిల్పి అక్షరములుతో లిఖించి అట్టి శాసనములు నాలుగు మూలలందు అమర్చబడినవి. ఈని స్త్రైగుణ్య ద్వాదశి షోడశి పంచదశిగ్రంథము, భక్తాదులకం దరికి శ్రీ సద్గురుమూర్తి ప్రసాదించిన జ్ఞానాజ్ఞాన అత్యంత విలక్షణమును అందరికి దెలియునట్లు శ్రీ. శ్రీ. శ్రీ. కొండపల్లి వీరవెంకయ్యగార్లు, సధర్మపత్ని సమేతులు శ్రీ. శ్రీమతి జగన్నాథమ్మగార్లు ద్వారా యీగ్రంథమున కర్త్యోకర్తృను, ముముక్షువులైన దంపతులిరువురి సహాయ్యద్రవ్యముతో అచ్చొత్తించబడియె. ooo

ఇట్లు

గురుచరణం. భవహరణం.

శ్రీ సన్యాసిముని స్వామి.



శ్రీ మద్వింపటి లక్ష్మీనరసింహ్వాత్రదేశి కేంద్రప్రభువులు

వీరి ప్రియశిష్యులు శ్రీ సన్యాసి మునిస్వామి

# శ్రీసద్గురు దీక్షాపుత్రులయిన శ్రీసన్యాసి మునిస్వామి పూర్వ చరిత్ర.

తనతల్లి తండ్రులు పుత్రసంతాన కాంక్ష చేత కేవల మునికోల నను నామముతో పలుకబడిన ఉత్తమోత్తమమైన తపోవనమునకేగి తపస్సు చేయగా, లేనిసేనను, కుమారుడనై జన్మించిన నాజాతస్యమునకు తండ్రి తనలక్ష్య సిద్ధిని తనహృదయము నందు తనతపో ఫలితమును పొందితి నను తనసంతోషోత్సాహాభరిత పూర్ణానందముతో తాను మునిస్వామియను నామాంకితమును, ఆర్యులచే స్థిరపరచిరి. నా జాతస్యుడైన మునిస్వామి పంచమీవర్ష అక్షరాభ్యాసమందు తోడిబాలురకన్న మిన్నగా జ్ఞానజ్ఞప్తిని తనకరమునందిడుకొని, తనకు పంచ దశవర్షములు పూర్ణముకాగా గురుకుల వాసము చేయుచు, సజ్జనసాంగత్యమే జన్మతరింపజేయునను జ్ఞానజిజ్ఞాసావలోకనము నిరంతరము తనహృదయమునందిడుకొని అనేక మంది గురువులను సేవించి జన్మ పవిత్రసాఫల్య జన్మరాహిత్యమును గోరి, పరమధర్మ నిర్మాతలయిన పరమ గురుకులవాసి:.. (శ్రీ). శ్రీమద్వెంపటిలక్ష్మి నరసింహ్వాదేశిక ప్రభువుల వారిపాద చరణ సేవితుడనై జ్ఞానాజ్ఞానోపాదిద్వయ దోషరహితుడనై గురుకరుణకు పాత్రుడనై నిరంతరము గురుచరణ సేవితుడనైతిని. ౦౦౦

ఇట్లు
గురుపాదాంకితులు
శ్రీసన్యాసి మునిస్వామి

ఓం
ప్రణవాతీతాయనమః
వందనములు,
గురుచరణం భవహరణం,
మహాఋషి సేవితాయనమః
శ్రీసద్గురు పరబ్రహ్మణేన్నమః.
సర్వం శ్రీనిజగురు చరణారవిందార్పణమస్తు.

శ్లో॥ యోసా వాసార సంసార పారావార పరాఙ్ముఖమ్.
తంవందే మందకానందం, నరసింహాచల దేశికమ్.

శ్లో॥ మన్నాథా శ్రీజగన్నాథా మద్గురు శ్రీజగద్గురు
మమాత్మా సర్వభూతాత్మాతస్మై శ్రీగురువేన్నమః.

శ్లో॥ అలక్ష్మీ హరతే నిత్యం, సుఖ సౌభాగ్యవర్ధినీ.
క్షీరమంగళ మాయుష్యం, అతః శాంతిప్రయచ్ఛమే॥

శ్లో॥ చైతన్యం శాశ్వతం. శాంతంవ్యోమాతీతం. నిరంజనమ్.
నాదబిందు కళాతీతం, తస్మై శ్రీగురువేన్నమః.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో. నిర్వికారో నిరంజన
నిరాకాంక్షో నిరాధారో నిత్యముక్త్యోస్మి నిర్మలః.

శ్రీ. శ్రీ. శ్రీయుతులు శ్రీశారదాప్రసన్నోపయుక్త, ఉత్తమోత్తములయిన. శ్రీ. శ్రీ. కొండపల్లి వీరవెంకయ్యగారి సద్ధర్మపత్నీ సమేతులు. శ్రీ శ్రీమతి.కొండపల్లి జగన్నాధమ్మగారి అపూర్వచరిత్ర.

శ్రీ శ్రీమతి జగన్నాధమ్మగారు తన జాతస్యమందే, సర్వత్రా పవిత్రమైన శ్రీ. శ్రీ. నీలాచలస్వామి: శ్రీజగన్నాధం అను నామముతో ప్రఖ్యాతి గాంచిన స్థానమందు, శ్రీ నీలాచలస్వామి నిండు కరుణాకటాక్షదయతో స్వామి సన్నిధానమందు జననమైరి: ఆమహాపవిత్రమైన క్షేత్రమందు జననమైనందువలన, శ్రీ. శ్రీమతి జగన్నాధమ్మగార్లకు,

జగన్నాథమ్మయును నానుగరగా ఆర్యులచే నిర్ణయింపబడిరి: జననకాలం దినదిన ప్రవర్ధమానురాలయి ప్రగతికి శ్రీ నీలాచలస్వామి, నిండుకరుణైన లీలలు ఆయమ్మయందు, కేవల దైవభక్తి దైవోపాసన వ్రతములు యిటువంటి శుద్ధసాత్త్విక గుణములలవడి ఆయమ్మ వున్నతోత్తమము, ఆగృహమున కంతయు సాత్త్వికగుణోపాసనే అలవడి దైవభక్తి, దైవారాధనల యందే, అందరిహృదయములు సత్సంగత్వులైరి.

ఆదైవభక్తి సదాసత్శీలత, శ్రీ. శ్రీమతి జగన్నాథమ్మగార్లను, జన్మసాఫల్యమైన జన్మరాహిత్యమును నొందింప జేయగల ఆత్మసత్శీలతయే సదా శాశ్వతమును తిలకించెను. అట్టి కాలమందు శ్రీ. శ్రీధరస్వామి పరంపరా సాంప్రదాయకమైనపరమగురుకులవాసము. అపరోక్షానుసంధానమైన నిజగురుచరణసేవితా ఆశ్రమము ఆమహాపవిత్రమైన. నీలాచలస్వామి కరుణయే ఆయమ్మను గురుకులవాసము గురుపుత్రుల స్నేహము కలిగింపజేసెను. శ్రీ. శ్రీమతి జగన్నాథమ్మగారు శ్రీ. సద్గురుకరుణకుపాత్రురాలయి, శ్రీసద్గురు కరుణబడసి. శ్రీ. శ్రీనీలాచలస్వామివారి నిండుకరుణమైన స్వస్వరూపమును దర్శించి, నిరంతరము శ్రీ. శ్రీమతి జగన్నాథమ్మగారు శ్రీసద్గురు కరుణామృత పాదచరణసేవితులై జన్మతరించి నిత్యముక్తినిబొంది శాంతిమూర్తులై ... ం

ఇట్లు

గురుచరణం భవహరణం.

శ్రీ మద్వేంపటి లక్ష్మీనరసింహశాస్త్ర దేశిక

ప్రభువులవారి ప్రియశిష్యుండగు శ్రీ సన్యాసిమునిస్వామి.

# మనవి.

“గోలకొండ” అనంబడు దక్కన్ హైద్రాబాద్ అఫ్జల్ గంజి, అక్బర్జీబజారు వాస్తవ్యులగు శ్రీకన్నెగుంటు పేరయ్యశ్రేష్ఠిగారు పరశివాద్వైతభావజ్ఞులగుటచే శ్రీబృహద్వాసిష్ఠ సిద్ధాంత ద్వాదశీ-షోడశీ-పంచదశీ మంత్రములకు సరిపోవునట్లు ఒకచక్రమును తయారుచేసియిమ్మని నన్నుకోరియుండిరి. నేనట్లు వ్రాసియిచ్చుటతోడనే వారు ప్రోత్సాహముగ దానినచ్చు వేయించి శిష్యబృందమున కందజేసిరి.

కేవలము చక్రము నచ్చొత్తించినంతమాత్రమున వారు తృప్తినొందక, ఆచక్రముయొక్క తాత్పర్యార్థమును కళ్ళకుకట్టినట్లు సుబోధముగనుండునట్లునన్ను వ్రాయుగోరిరి. శ్రీసద్గురుకృపాకటాక్షమున నేనుగ్రహించిన విధమున ఆ చక్రతాత్పర్యార్థము నీచిన్నపుస్తకమున సంగ్రహించితిని. ఇందలిదోషములున్న సవరించుకొని దీనిభావమును గురుపుత్రులు గుర్తించెదరుగాక.

పైవారి ద్రవ్యసహాయముతో 1938 సం॥రం ౫౦౦ ప్రతులుఅచ్చొత్తించబడినవి. సదరుప్రతులు పూర్తిగా వినియోగమగుట చేతనున్నూ, కొందరుభక్తులు కోరుచుండుటచేతనన్నూ, తిరిగి మరి ౫౦౦ ప్రతులు భక్తుల ద్రవ్యసహాయమున అచ్చొత్తించడమైనది.

ఇట్లు
విన్నవించువిధేయుడు
వెంపటి లక్ష్మీనరసింహము.



శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ బ్రహ్మవిద్యావసిష్ఠ సిద్ధాంత నిస్త్రైగుణ్య

# ద్వాదశీ-షోడశీ-పంచదశీ-ఇత్యాది మంత్రాక్షర కల్పిత చక్రము.

## చక్ర తాత్పర్యార్థ సహితము

శ్లో॥ యోసావసారసంసార పారావారపరాఙ్ముఖః।
తం వన్దేమనన్దకానన్దం వేఙ్కటాచల దేశికమ్॥

పైన పేర్కొనబడిన చక్రముయొక్క పటము ఎడమవైపున సతికించబడి యున్నది. ఈచక్రమునందు 15 భావ సూచనలు గలవు. అవిక్రమముగ జూపబడుచున్నవి.

## ౧, అష్టదిగ్బంధ భావము

పటమును అభిముఖముగా నుంచుకొనుము. (1) కుడిచేతి వైపు తూర్పు, (2) ఎడమచేతివైపు పడమర, (3) శిరస్సువైపు ఉత్తరము, (4) పాదములవైపు దక్షిణము, (5) ఉత్తర-తూర్పు దిశలమధ్య ఈశాన్యకోణము, (6) తూర్పు-దక్షిణములమధ్య ఆగ్నేయకోణము, (7) దక్షిణ-పశ్చిమములమధ్య నైరృతికోణము, (8) పశ్చిమ-ఉత్తర

ములమధ్య హాయున్నగోళము, అని అష్టదిక్కుల భాగము నెరుంగవలయును. ఈయష్టదిక్కులందును గల భావస్థానములు క్రింద వివరింపబడును.

1. తూర్పుదిశలో సున్ననుండి కలిగిన అంకెలభావము

బిందువనువృత్తము కల్పితమైనది. ఈ వృత్తము రెండు సమభాగములుగా (అనగా రెండు అరసున్నలుగా) విభజింపబడి అరసున్నకు అరసున్నను అనేకవిధములుగా జేర్చుటవల్ల "౧ మొదలు ౯ వరకు" గలఅంకెలు అరసున్నలచే మారురూపములై "అంకెలు" అనుసంజ్ఞనుగలిగి, గుణకారము, భాగారము మొదలగు లెక్కలుగల గణితశాస్త్రమునకు మూలాధారములైనవని సూచింపబడెను.

2. పడమరదిశలో సున్ననుండి కలిగిన అక్షరముల భావము

పైన ఉదహరించినరీతిగానే వృత్తమును వర్గులు,ఉపవర్గులుగా (అరసున్నలుగా)' విభజించి అక్షరసంకేతమునకు అర్థమగునట్లు అరసున్నలను సున్నలకు జేర్చినచో "అ మొదలు య వరకు" షడ్భావవికారములుగల అక్షరములు ఏర్పడును. ఇట్లేర్పడిన అక్షరరాశియే వేదశాస్త్రపురాణాదుల యావిర్భావమునకు మూలాధారమయ్యెను. కావుననే "అకారాదిక్షకారాన్త వర్ణానాం పఞ్చాశతాం పఞ్చాశదక్షరస్థానేషు ధ్యాన దేవతావర్ణాదినిర్దేశేన ప్రతిష్ఠాన

ముక్త్వా" అని అక్షరమాలి కోపనిషత్తులో జెప్పబడెను. శు॥ ని॥ కందార్థము - "పంచాశదక్షరముల ప్రపంచము-తానుద్ధరించె- ప్రణవాక్షరమందంచు(శ్రుతులెన్న" ఇత్యాది దృష్టాంతములచేత పై తాత్పర్యార్థమును సూచించుచున్న దని తెలియనగును.

### 3. ఉత్తరదిశలో 'సున్న' తన లెక్కను తాను శూన్యము (సున్న) చేసికొను భావము

'౧' (ఒకటి) అను అంకెకు కుడివైపునఒక సున్నయు ఎడమవైపున ఒకసున్నయు లెక్కతీర్పటమునకుగాను కనుపర్చబడెను. అదియెట్లన :- ఒకటంకెకు దాపలను. సున్న ఒకటి చొప్పున పెట్టుచుపోగా "౧౦" ఇదేవిధముగా లెక్క గొప్పగొప్ప విలువతో పెరిగి పోవును. గాని ఆ ఒకటంకెకు వలపలను, సున్న-(బిందువు) ఒకటిచొప్పున పెట్టుచుపోగా "౦౧౦" ఇదేవిధముగా వెనుకటి లెక్కలోనచ్చిన అంకెలు ఉండగానే ఆ లెక్క అంకెలకు విలువ శూన్య మయ్యెను. ఇట్లు లెక్క అంకెలు ఉండియు. ప్రయోజనము లేకపోయిన విధంబున, సర్వకల్పనలకు ఆధారమగుచు ఒకటైయున్న (నేను నేనని) గుర్తెరిగే శరీరము గురుమూలమున తన మూలమెరయగానే (అనగా తాను, తనచిత్రములు సున్న యనియెరిగిన తత్ క్షణమే( తానుండగానే తాను లేక పోవును. శు॥ ని॥ కందార్థము-"ఒంటుకు దావల బిందొంట్లంటించిన

కోలది। లెక్క అధికంబగు। నాబంటుకు వలపల బిందోక్కటం టించిన! లెక్క వృత్త క్యాగదనోయీ। బంటుండీ లేందా గద నోయీ। తంటాదీరునుచూడు దానివలెనె మొకక కంటే బైలును। తానుగలిగుండి తనకుళ్ళక్యా గదనోయీ।బంటుండీ లేందాగదనోయీ" అని యీరీతిని పెద్దల యనుభవము గూడ సూచింపబడెను.

## 4. దక్షిణదిశయందు చక్రనామము

శ్రీబృహద్వాసిష్ఠసిద్ధాంత నిస్త్రిగుణ్య - ద్వాదశీ - షోడశీ - పంచదశీ - ఇత్యాదిమంత్రాక్షర సంకేతములుగల చక్రము అనిఆనామము యొక్క వివరణము నెరుంగవలయును.

## 5. ఈశాన్యకోణములో ఓంకారమాతృకాభావము

"ఓ" అను క్షరసంజ్ఞయందు "అ-ఉ-మ" అనుత్రక్షర సంజ్ఞలకు సరిపోల్చబడ్డ త్రిమూర్తులున్నూ, వారిత్రిస్థానాకార వర్ణములున్నూ కలిసి ఓంకారమాతృక అయినది. శ్రుతి-"అకారం బ్రహ్మరూపంచ ఉకారం విష్ణురూపకమ్। మకారం రుద్రరూపంచ త్రిమూర్తి ప్రణవాత్మకమ్॥" అని యుండుటచే త్రిస్థానములున్నూ మూడున్నులుగానిర్ణయించబడినవి. ఈమూడున్నూ వారి ఆవరణాకారము లనిభావము. ఈమూడు. ఆవరణాలకే "అండ-పిండ-బహ్మాండ"ములనికూడ సంజ్ఞకలదు. వేమనగారుకూడకం॥ "అండాండములు మున్న,

పిండాండములు సున్న, బ్రహ్మాండములు సున్న, బ్రహ్మసున్న, సున్న జుట్టినవాడెపో సుజ్ఞానయోగిరా విశ్వదాభిరామ వినురవేమ" అని చెప్పియున్నారు. కావున ఈరీతిని విచారించిన తెల్లమగును. ఆ "ఓం" అను ప్రణవములో, (ఆకారత్రయము) మాత్రాత్రయము, యిమిడి యున్నట్లు "అహం" (నేను) అను పలుకునకు మేను ఉపాధి త్రయమని భావించవలెను. పలుకునకు ఉపాధియైన వాగింద్రియము ఆవరణమని చెప్పక తప్పదు, కనుక "మేను అనే ఉపాధి లేనిచోట "నేను" అనే ధ్వని లేదు. "అక్షరం" శబ్దము అనిన్ని, దానికి ఆవరణరూపకముగు "ఓ" అను రూపము క్షరమనిన్ని కల్పితమయ్యెను. "క్షరాక్షరః" ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని శ్రుతులలో ఉన్నందున శబ్దమే అక్షర పరబ్రహ్మమనే బీజము. ఈబీజమునకు ఉపాధియగు "ఓం" అను క్షరసంజ్ఞ కల్పితోపాధి అయ్యెను. "ంం" —ఇట్లు మూడుసున్నలుగా ఉన్న మూడు ఆవరణములలో, రెండు సున్నలు నాలుగు అర్ధానుస్వారములై "ఓ" అను ఆకారము చేయబడెను. మిగిలిన మూడవసున్నను వాని ప్రక్కను చేర్చగా "ఓం" అనే రూపోపాధిక సంజ్ఞ కలిగినది. ఇదియే సకలమంత్రములకు, సకలశాస్త్రములకు, సమస్తజగజ్జాలమునకు, ఆధారభూతమైన ప్రణవరూపకము ను ధ్వనియుక్త ప్రకృత్యుపాధిగా భావింపబడినది. శ్రుతి–"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః॥" తస్యప్రకృతి లీనస్య యః

పరస్సమ హేశ్వరః।" అని యుండుటచే ప్రణవమను శబ్దము నను లయమున్నట్లు చెప్పబడుచున్నది. శ్రు॥ నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే. "అందుచే క్షరాంక్షరములు రెండును నాశనమగు నని యెరుగవలయును. శ్రు॥ "రక్షకో విష్ణురిత్యాదిబ్రహ్మ సృష్టేస్తుకారణమ్. సంహారోరుద్ర ఇత్యుక్తం సర్వం మిత్యేతి నిశ్చయః" అని యుండుటచే ముగ్గురుమూర్తులను మూడు సున్నలు క్రింద యెన్నవలసినదని భావము.

### 6. అగ్నేయకోణములోని జీవేశ్వర స్వరూపము

౧ ౨ ౩ ౪ ౫

ఈకోణమున "న మ శి వా య "అను పంచాక్షర సంజ్ఞలతో నున్న పంచకోణాకారములగల యంత్రమున్నది. అందు ఊర్ధ్వకోణమధ్య యందుకారణోపాధియని పిలువబడు లింగాకారముగనుండు గళ- శిరస్సులున్ను, తూర్పు-పశ్చిమకోణముల[illegible], మధ్య బాహువులు[illegible]వక్షస్థల-నాభికుహారములున్ను, అధఃకోణముల రెండింటి మధ్యను కటి-గుద-గుహ్య-ఊరు-పాదములున్ను, "యత్పురుషం వ్యదధుః, కతిధా వ్యకల్పయన్. ముఖం కిమస్య కౌ బాహూ, కావూరూ పాదావుచ్యేతే చన్ద్రమామనసో జాతః, చక్షోస్సూర్యోఅజాయత, ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ, ప్రాణాద్వాయురజాయత, నాభ్యా ఆసీదన్తరిక్షం శీర్ష్ణో ద్యౌస్సమవర్తత, పద్భ్యాంభూ

శ్రుతి [redacted]మిద్దిశ శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్ప యన్" అను శ్రుతిప్రకారము కల్పించికనుపర్చ బడెను.

ఇదే శరీరమను స్వరాట్టుగా మొదట కల్పన అయినది. దీనినే "త్రిస్థానం పంచదైవతమ్" అనిన్నీ, త్రిస్థాన లింగత్రయ మనిన్నీ వాడుకొనుచున్నారు. ప్రభులింగ లీలతో ౧ వ ప్రకరణ మున అల్లమాప్రభువు ఇట్లుసూచించిరి-"గుద గుహ్యస్థానంబులు గురులింగనాథునకు వాస దేశంబు నాభిహృదయ గళంబును జరలింగమూర్తికి వాస దేశంబు। భ్రూమధ్య బ్రహ్మరంధ్రంబులు ప్రాణలింగమూర్తికి వాసదేశంబు। వీటిని యెరిగి వర్తించువాడు శంకరునకు ప్రియుడు॥" అని, కనుక ఒక్క లింగాకారము గల సిరస్సేగాక, పానువట్టమురీతిగా సోమసూత్రములతో కూడుకున్న శరీరమును కూడా అందు నిరూపించిరి. అందుచేత పానుపట్ట సహితమైనదే లింగమని ప్రసిద్ధిగలిగి పార్వతీ పరమేశ్వరులని, గౌరీశంకరులని, లింగాంగములని, జీవేశ్వరులని శివశక్తులని, శివకేశవులని,-ఇట్లు అనేక నామములతో వారి వారి అనుకూల్యానుసారముగా జడరూపమగు మృత్తికా-శిలా-తామ్ర-స్ఫటిక-లోహాదులతో మూర్తులను చేయించి వాటినే పూజచేయుచున్నారు. ఇందుకు బ్రహ్మాండ పురాణమున నొక గాథకలదు.

పూర్వయుగములో నైమిశారణ్యమునందు ఈశ్వరుని వల్ల వరమపేక్షించి కావున ఋషిదంపతులు తపస్స

చేయుచుండిరట. వీరి తపంబునకు మెచ్చి శంకరుడు వరమిచ్చుననుద్దేశముతో కైలాసమునుండి భూలోకమునకు వచ్చుచుండగా మార్గమధ్యమునందు నారదులవారు కలిసిరట. ఆ నారదులు "ఎక్కడికిపోవుచుండిరి?" అని శంకరుని అడుగగా నైమిశారణ్యమున తపస్సుజేయుచున్న ఋషిదంపతులకువరంబుల నియ్యదలచి వెళ్ళుచున్నాను." అని శంకరుడు చెప్పగా నారదుడు శంకరుని పోవద్దనియు, ఆఋషి దంపతులు దేవతలను నాశనముజేయుటకు వరంబుగోర నిశ్చయించి తపంబుచేయుచున్నారనియు, వెనుక నిట్లే భస్మాసురుడు తపంబు జేయగా నీవు వరమునొసగి పిమ్మట నెన్నిశ్రమలుపడితివో యోచించుకొని వీరికి వరములొసగవలసియుండుననియు నారదుడు చెప్పగా, శంకరుడచ్చటికి పోవుటమాని తిరిగి కైలాసమునకే యేనగెట.

ఆఋషిదంపతులు తపోనియమిత కాలము గడిచినను ఈశ్వరుడు ప్రత్యక్షముకానందున మిక్కిలి యాగ్రహము జెంది, నిద్రాహారములు విసర్జించి, పృథగాసనాసీనులై ఘోరతపంబు జేయమొదలిడిరి. అంతట ముల్లోకములందును వీరియుగ్రతపంబున నగ్నిజ్వాలలు బయలుదేర, దేవమనుష్యాదులందరు శంకరుని వద్దకు, విష్ణుమూర్తి వద్దకు పరుగిడి మొరబెట్టుకొనిరి. అప్పుడు శివకేశవులిద్దరు నైమిశారణ్యమునకేగి ఆఋషిదంపతుల యాశ్రమమును జేరి, శంకరుడు

మన్మథరూపమును దాల్చి ఋషిభార్యను, విష్ణువు మోహినీ రూపమును దాల్చి కావనఋషిని మోహింపజేసి తపోభ్రష్టులను గావించిరట.

అంతట నాఋషిదంపతులు తమకుకలిగిన చిత్తచాంచల్యమును గమనించి కండ్లుతెరచి మన్మథమోహినీ వేషధారులగు శివకేశవులను తమ తపస్సును భంగపరచిరను కోపమున తీవ్రదృష్టితో జూచి "వీరల యోనిలింగములు తెగి పడుగాక" అని శపించిరట. తక్షణమే వారల యోనిలింగములు తెగి భూమిపై పడుటగాంచి వారులజ్జాన్వితులై యుండగా, నారదుడు కైలాసవైకుంఠములకేగి యచ్చట శివకేశవులజాడ లేనందున వారు భూలోకమున కేగినసమాచారం తెలిసికొని వెంటనే ఈయాశ్రమమునకు జేరగా వానిని జూచి శివకేశవులు సిగ్గుజెందిరట.

"ఓనారదా! ఋషిదంపతులతపంబు భంగపరచితిమి. గాని, వారిశాపమువల్ల నీయవమానము మాకుజరిగినది. ఈ యోని లింగముల నేమి చేయవలసియుండును!" అని శివకేశవులు అడిగిరట. అప్పుడు నారదుడు శివకేశవులను స్తుతించి, యోనిలింగములను పూజనీయములుగా జేయుచున్నాననియు, మీరు నెఱుగుపడ నవసరము లేదనియు చెప్పెనట. అంతట దేవతలు మొదలైన వారందరు వచ్చినిలిచియుండగా నారదుడు క్రిందపడియున్న యోనిలింగములను చేతదీసి, యోని

మధ్య లింగమునుంచి, ఒక పీఠముపైని ప్రతిష్ఠించి ఈ యోని లింగములు శివకేశవులయొక్క చిహ్నములనియు, మనుషాది సమస్త జంతుజాలంబులకు పార్వతీపరమేశ్వరుల మాతా-పితా రూపంబగు సృష్టికర్తలనియు శ్రు॥ "విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పిగ్ంశతు॥" అనియు నమ్మి వీటిని ఆరాధించువారికి శివకేశవులు కైలాస వైకుంఠపదవుల నిచ్చెదరనియు పలికి, అనేకభంగుల స్తుతించి, తత్క్షణమే దేవతల నందరిచేత నీ యోనిలింగములకు అభిషేకంబులు, పూజలు మొదలగునవి చేయించి "శ్లో॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే। శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః॥ యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయ శ్శివః॥" అని యీ ప్రకారంబుగా స్తుతించి, భూలోకములో ఆచరించుటకుగాను అనుగుణ్యములగు మంత్రతంత్రంబులును అందుకుదగిన శ్రుతి-స్మృతి-ఇతిహాస1సూక్తంబులును గల్పించి లింగపానువట్టములని పేరుబెట్టి, విడిచిపెట్టి తదుపరి వారందరు వారివారి స్వస్థానంబులకు అరిగిరట.

అది మొదలు భూలోకములో వీటి ప్రాముఖ్యము ఎక్కువయ్యెను. ఆయామతస్థులలో లింగమే ముఖ్యమని కొందరు, యోనిరూపంబగు పానువట్టమే ముఖ్యమని కొందరు, లింగము-పానువట్టము రెండును ముఖ్యమని కొందరు భావించి మిథునకైంకర్యములనియు, బిందు దర్పణములనియు, యోనిపూజ

లనియు, యోనిపానంబులనియు, లింగ-అంగ పూజలనియు. అంగలింగసంయోగ రహస్యగోష్ఠులనియు, మాంసపుష్ప సేవలనియు, దక్షిణాచార వామాచారములనియు. ఎన్నో రీతుల ఆరాధించుచున్నారు.

యాజుషీయస్కందోపనిషత్తులో "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః। త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్ ॥ అని యుండుటచేత నీ శరీరము దప్ప వేరుగా శివుడుగాని, ఆలయముగాని ఉన్నట్లు కనబడదు. శ్రు॥ "ప్రథమం తారకం చైవ ద్వితీయం దండముచ్యతే" అన్నట్లు శిరస్సు తారకాకారము లింగమనియు, దండమునకు కూర్చుండు భాగము పానువట్టమనియు, ఈ మొత్తమే "ఓంకార" ఆకారమనియు భావించవలయును. పరిపూర్ణ సుధాకరమునందు సీ॥ "ఓమ్మను యేకాక్షరోచ్చారణార్థంబు దేహంబు కే జెల్లు ధీవిశాలి। జ్యోతిరూపక మాటచే తెల్లు గానయ్యె। జ్యోతియెట్లయ్యెనో జూడుమింక। నారయ మొదటిది శిరము తారకమయ్యె। గళమాదిగాను యాకటియువరకు దండంబుగాను కూర్చుండు భాగం బెల్ల ॥దవ్య॥ కుండలము నబరగెను- నేత్రముయర్ధ చంద్రమున బరగెను- నిండైన కనిగ్రుడ్డు మోడను బిందువయ్యె-అంటిగ పైయెను గూడియుండగ జ్యోతియయ్యె॥ కండల॥" అనుటచేత శరీరమునే నిరూపించెను. సమస్తతీర్థ ప్రసాదములను ఆరగించునది

లింగాకారమగు ముఖము. ఆరగించినతరువాత నిర్మాల్యమును విడచునది గుదగుహ్యములతో నున్న కర్మేంద్రియ పంచక మగు పానువట్టము, అని తెలియనగును. ఏకాకారముగ నున్న లింగమునకు త్వక్-చక్షుః-శ్రోత్ర-జిహ్వా-ఘ్రాణము లను పంచావరణలు గలవు. వీటినే లింగపంచంచకమని, గగన పంచకమని ప్రజ్ఞాన పంచకమని; జ్ఞానేంద్రియ పంచకమని, గంథములందు బహువిధములుగా వాడుచున్నారు.

ఈపంచ ఆవరణలయందుగల చైతన్యమునకు పంచ శక్తులు (ఇచ్ఛాశక్తి. క్రియాశక్తి. జ్ఞానశక్తి, ఆదిశక్తి-పరాశక్తి) అనియు పంచబ్రహ్మలు (సద్యోజాత-వామదేవ -అఘోర-తత్పురుష-ఈశానులు) అనియు చెప్పుచున్నారు. ఇదియే కారణమై, మహాకారణమై బ్రహ్మాండ జననమునకు మూలమని "పృథివీబ్రహ్మా, జలేవిష్ణుః తథారుద్రోహుతాశనః॥ ఈశ్వరః పవనశ్చైవ ఆకాశేతు సదాశివః॥" అని శ్రుతిలో జెప్పబడుచున్నది. ఈపంచకమునే (మను-మయ-త్వష్ట-శిల్పి-హిరణ్య) బ్రహ్మలని కూడా కొందరు వాడు చున్నారు. ఈపంచకమునే "పంచ పంచాశతః పంచదశాః పంచపంచాశతస్సప్తదశాః॥ పంచ పంచాశత ఏకవింశాః। విశ్వసృజాగం సహస్ర సంవత్సరమ్। ఏతేన వై విశ్వసృజ ఇదం విశ్వమసృజంత। యద్విశ్వ అపసృజంత తస్మాద్విశ్వసృజః। విశ్వమేనానను ప్రజాయతే॥" అని శ్రుతి ప్ర + పంచ, పంచక

 

మును చెప్పుచున్నది. ఈపంచావరణశూన్యమే పరశివ స్వరూపమని "శివోహమితి నిశ్చిత్య ఏతత్సర్వం పరిత్యజ। నమశ్శబ్దో భ వేజ్జీవః శివశబ్దః శివోభవేత్"॥ అని శ్రుతి చెప్పుటచే శివుడనినను, విష్ణువనినను శబ్దమాత్రమే కాని మూర్తిరూపములు లేవనియు, శబ్దము రెంటి సంయోగమునల్ల కలిగినందువల్ల పలుకు శూన్యమనియు 'యశ్శబ్దఃద్వయసంయోగేన నిశ్చితః." "మయిజీవత్వ మీశత్వం కల్పితం వస్తుతోనహి" అని శ్రుతులు నక్కాణించు చున్నందున శబ్దశూన్యమే పరశివ స్వరూపమని నిశ్చయించిరి. జీవేశ్వరులు కల్పితమని స్పష్టపడుచున్నది. ఈప్రకారము తాత్పర్యము చేసుకొనుటకు గురుకరుణ కారణము అని భావము.

## 7. నైరృతికోణములో త్ర్యక్షరీభావము

భావనోపనిషత్తులో "వృత్తాద్బహిః త్రికోణాంతరైం, క్లీం, సౌః ఐం=వాగీశ్వర్యై చ విద్మహే, క్లీం=కామేశ్వర్యై చ. ధీమహి, సౌః=తన్నః శక్తిః ప్రచోదయాత్। త్రికోణ భూమ్యాదిత్వర్థః। దేవీహృదయం ప్రతిష్ఠితం, దేవీశబ్దేన త్రికోణాన్తర్గత బిందుః గ్రాహ్యః అంతరంగవిచారణంచు ర్యాదిత్యర్థః॥" అనియుండుటచే బాలాయంత్రమునకు త్రికోణ త్రిబీజ సంజ్ఞలు యివ్వబడెను. దానిమధ్యను బిందువనే పరాపరలుగల వృత్తముచున్నది. శ్రు॥ "ద్వే విద్యే" అను

టచే పరాపరద్వి భాగములలోను అపరమందు శివ కేశవులని, శివశక్తులని రెండువిధములుగా విభజింపబడెను. పరాపర విద్యలని వేదవేదాంగములందు నిర్ణయింపబడి యున్నందున జ్ఞానప్రతిపాదకమని, కర్మప్రతిపాదకమని, జ్ఞాన-కర్మప్రతిపాదకమని శాస్త్రకారులు వివిధముగా కల్పించి అభ్యసించుచున్నారు. ఇవియే మోక్షసాధనములని నమ్మియున్నారు. నిరాలంబోపనిషత్తునందు 3 ప్ర॥న "బంధ ఇతి చ అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధిసంకల్పో బంధః। దేవమనుష్యాద్యుపాసనాకామసంకల్పో బంధః। యజ్ఞవ్రతతపో దానవిధివిధాన జ్ఞానసంకల్పో బంధః॥" అని చెప్పుటచే నీ రెండువిద్యలు బంధహేతువులుగాన విద్యా-అవిద్యాతీత విమలవిచారణ యేది కలదో అదియే జన్మరాహిత్య హేతువని భావము.

## 8. వాయవ్యకోణములో తారక భావము

తారకాకారగోళము బ్రహ్మాండగోళము త్రివర్ణయుక్తమైన మూడుభాగములుగా గలదు. దీనిమధ్య శ్రీరామషడక్షరీయుక్త షట్కోణాకారము లిఖింపబడెను. శ్రు॥ "రామమంత్రాఉక్తాః। ద్వ్యక్షరీ- షడక్షరీత్యాదికాః,

౧ ౨ ౩ ౪ ౫ ౬

తదో రామమంత్రోద్ధారఉక్తః॥" అనుటచే "శ్రీరామ జైరామ" అని రామషడక్షరీబీజములుగా వ్రాయబడెను. షట్కోణమధ్య, బ్రహ్మపదయుక్తతమును బిందువు చుట్టబడి

త్రిపురసుందరీసంజ్ఞాబీజమగు ఓంకారము(తలక్రిందుగా)కను పర్చబడెను. ఇదియే షోడశకళాస్వరూపమగు సచ్చిదానంద ముగా నెరుగునది. ఈకళారూపిణియే (లలితా) "బ్రహ్మణీ బ్రహ్మరూపిణీ" అను బ్రహ్మకళయే "ఖంబ్రహ్మ" అని సిద్ధాంతీకరించిరి. శ్రు॥ "ఖం వాయురాపో జ్యోతిః," "ఖం మధ్యే కురు చాత్మానమాత్మమధ్యేచ ఖం కురు। ఆత్మానం ఖమయం కృత్వాన కించిదపి చిన్తయేత్ ॥ ఆకాశమానసం కృత్వామనః కృత్వా నిరామయమ్। నిశ్చలం తం విజానీయాత్స ముక్తోనాత్ర సంశయః॥" అని యుత్తరగీతావాక్యము రీతిగా దీనితాత్పర్యము గ్రహింపవలెనని భావము.

## ౨. చక్రమందుగల రంగులభావము.

రంగులకు వర్ణములనికూడా పర్యాయపదము. ఈరంగులే ప్రపంచ రూపకమగు శరీరముతో బుట్టినవి. శుక్లశోణితములు శరీరజననమునకు కారణమగుటచేత శరీరమే రంగులకు ఆలయము. శ్రు॥ "యస్మై మాతా ప్రమమాదయశ్చచారానను వ్రతం, తస్మై రేతః పితా వృంక్తాం, మాభురన్యోపపద్యతామ్," "ఓషధీభ్యోఽన్నం అన్నాత్పురుషః." "అన్నేన జాతాని జీవంతి" అని శ్రుతులును సు॥ వి॥ కందార్థము-"అన్నము శుక్లంబగు రసమున్నతిగా రక్తమగును। నొకచో రెండున్ పన్నుగగలసిన మేనని యెన్నబడున్

మెరుగుకగలిగి॥ యిదెమాయసుమ్మీ। మూలము లేనిదని నీవు నమ్మీ॥"అని పెద్దలవాక్యములును, శ్లో॥ రక్తం శుక్లం తథా కృష్ణం నీల పీతాదిశోభితం। తన్మధ్యే దర్శితంయేన తజ్జ్యోతిః బ్రహ్మకేవలమ్॥ ఇత్యాదివాక్యములుబట్టిన్నీ రంగులు (వర్ణములు) భేదముగా కనుపర్చబడెను. ఈరంగులే మానవరూప వర్ణముల పోలికకు నుపయుక్తములై యుండెను. వజ్రసూచ్యుపనిషత్తున శ్రు॥ "బ్రాహ్మణో ధవళః క్షత్రియో౽రుణః॥ వైశ్యఃపీతః శూద్రఃకృష్ణః॥" భగవద్గీత-"శ్లో॥ చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః॥" అని చెప్పబడిన ప్రకారం ఈరంగుల యొక్క భావము గ్రహించునది.

## 3 నాలుగురంగులుగల నాలుగు ఆవరణలలోని భావము.

### చక్రదళములలో అక్షరములు పఠించువిధము

(ప్రతి చక్రములో వుత్తరదిశనుంచి ప్రారంభించి-ఆరంగుదళములోయున్న మొదటి అక్షరముతో-తిన్నగా దక్షిణమున యున్న ఆరంగుదళములోయున్న చివర అక్షరముతో కలుపుచూ-యిదేరీతిని-చుట్టూవున్న అక్షరములను సమన్వయముచేయగా దిగువ లెఖ్ఖసౌజ్ఞతో వున్న-మంత్రములకు సరిపోవును.)

### 1. వానిలో మొదటిఆవరణయందుగల భావము.

ఇందు ద్వాదశదళములున్నవి. దళములయందుగల శ్రుత్యుక్తబీజాక్షరములు 12ను ఆఆవరణాభిప్రాయమును వెల్లడించు చున్నవి. ఎట్లన-

 

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯ ౧౦ ౧౧ ౧౨

(౧) అ యం న్వ ర్థ భా హ్యా కో పి న భ వ తి
(౨) ఏ త స్మి ధ్యా శు ద్ధ వి య త్రిం చం నా స్తి
(౩) అ భా వం శి వం అ శి వం న లి ప్య తే

ఇవి గీర్వాణాక్షర సంజ్ఞాబీజములైయున్నవి. వీటియొక్క మొత్తముఅర్థము.

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭ ౮ ౯ ౧౦ ౧౧ ౧౨

విచారింపగా, యీ వృ త్త బ ట్ట బ య లు యే మీ లే దు అని నిర్ణయముజేయనగును. బైలన్నా, పరిపూర్ణమన్నా, బ్రహ్మమన్నా, పరమపదమన్నా, కైలాసమన్నా, వైకుంఠమన్నా, మాటలభేదంబులేగాని, వస్తువు యేమీలేని బైలే. విలాసంలేనిది కైలాసమనియు, కుంఠితములు లేనిది వైకుంఠమనియు, మృతంలేనిది అమృతమనియు, గ్రంథములయందు ప్రయోగములు గలవు. ప్రపంచకల్పనకు పూర్వము పరిపూర్ణమగు పరశివస్వరూపమే యున్నదని శు॥ ని॥ కం॥ "ఇది దప్పయేమి లేదని మొదటిది మొరబెట్టుచుండు। ముదమున వినువారా॥" అనునట్లు మొదట నిరాకారమే యున్నదని చెప్పుచున్నది. లేనివికారముగన్క నిర్వికారమే యున్నదని యీ మొదటి ఆవరణయొక్క భావసూచనము. తక్కిన మూడు ఆవరణలును, దృగ్దృశ్యములలో జేరినవగుటచే ఆగమనిగమవాక్యపద్ధతిని గుర్తెరుగనలెనని భావము. యింగా మూడునావరణలు భావనోపనిషత్తులో చెప్పబడిన వృత్తి

త్రయ, పురత్రయ, సదనత్రయ, అను త్రివిధావరణలుగా భావింపబడవలెను.

## 2. ద్వితీయావరణయందు గలభావము.

షోడశదళములు, ఆదళములలో శ్రుత్యుక్తషోడశ బీజాక్షరములును, షోడశదళ ఆవరణలకునుగల సంజ్ఞానామము లును కనుపర్చపడెను. వాటిభావము, ర మేనులున్నూ, ర అవస్థలున్నూ, ర అభిమానులున్నూ, ర కరణములున్నూ, కలసిన మొత్తమే షోడశకళాస్వరూపమగు ఆవరణలని భావింపబడెను. షోదశఆవరణలయొక్క యథార్థభావము, దళములయందుండు షోడశ అక్షరములను ఏకత్వము జేసి, గురు మూలంగా—

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ | ౧౬ |
| ని | ర్మ్ర | ల | మే | త | ధా | జ్ఞా | న | శ్వ | రీ | రం | సా | స్థి | కే | వ | లం |
| మూ | లా | భా | వ | మి | దం | జ్ఞా | తుం | న | శ | రీ | రం | న | కి | మ | పి |
| న | మూ | లం | అ | యుం | మి | ధ్యా | న | శి | వం | కూ | న్యే | కి | మ | స్థ | న |

—ఇట్లు విచారించిన తెలియనగును. ఈమూడుమంత్రములను

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ | ౧౬ |
| శే | ని | ఈ | శ | కీ | రా | వ | ర | ణ | ల్కు | మూ | లం | యో | మి | తే | దు |

అని తాత్పర్యార్థము. ఈప్రకారంగా గోచరించును. ఇట్లు గుర్తెరిగే స్థూలావరణ (శరీరము) యేదిగలదో అదే శ్రీచక్రం అని, (అధర్వణ భావనోపని షత్తునందు) శ్రు॥ "శరీర మేవ శ్రీచక్రం నిర్వర్ణ్యసంకల్పా॥ కల్పతరత। ఇత్యాది

 

నాశాక్తమతో క్తార్థాసర్వే పిశరీరకపత్వాత్నానాసంభావ్యా। ఇత్యుపదిశ్య॥" అని యిట్లు చెప్పియున్నందున శరీరం అని భావము.

3. తృతీయావరణయందుగల భావము–

పంచదశ దళములును, పంచదశ ఆవరణలుమధ్య శ్రుత్యుక్త పంచదశబీజాక్షరములును, పంచదశ ఆవరణకు గల ప్రత్యేక నామంబులును కనుపర్చబడెను. 5 భూతములు, 5 కోశములు. 5 ప్రాణములు, మొత్తముఈపదిహే నున్నూ, ఆవరణములయొక్క రూపసంజ్ఞలు. ఈయావరణలయందుగల బీజాక్షరములను గురుముఖంగా విచారించిన వారికి శ్రు॥

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స్వ | ప్న | ప్ర | తీ | య | మా | న | రూ | పా | ణి | చ | య | ధా | త | థా |

అనియు, ఈ మంత్ర తాత్పర్యము—

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| యూక | అ | దో | చి | న | శ | రీ | ర | ము | లు | యే | మీ | తే | దు | |

అనియు నిర్ణయము తాగలదు అని భావము.

ఈద్వాదశి, షోడశి, పంచదశి, అనుమంత్రముల ప్రభావము ఉపనిషత్తులందును, ఆగమసూత్రములందును, సప్తకోటిమహా మంత్రములు ఉన్నవని నిర్ణయింపబడినది. అందుండి మహాఋషులు, వారికార్యావసరములనుగాను బీజ గుణదేవతలను కల్పించి ఉపాసించుచుండిరి. ఈమంత్రము

లలో, కొన్ని జ్ఞానరూపకములని, కొన్ని కర్మరూపకములని, కొన్ని పరమార్థకరూపములని, విభజించి అందుకుతగిన సూక్తములు, ధ్యానయోగముద్రలు, యంత్రములు, తంత్రములు, ఉచ్చాటన, ఆకర్షణ, స్తంభన, ప్రయోగములు కల్పించిరి. ఇవియన్నియు ఆగమసూత్రములే యనిరి. ఇట్లు భిన్నాభిప్రాయముతో ఋషిప్రోక్తములై యున్నవి. ఎందుచేతనన:-"శ్రుతయశ్చభిన్నాః స్మృతయశ్చభిన్నాః। మహాఋషిణాం మతయశ్చభిన్నాః॥" అని యున్నందున ఇన్నివిధములుగా మంత్రములు, ఉపాసనలు, ఆచారములు జరుగుచున్నవి. ఎన్నియైనను సమస్తమంత్రములకు ఓంకారమను బీజాక్షరము మాతృకఅయియున్నది. అందుచేత మంత్రోచ్చాటనారంభమందు జాతాశౌచమున్నూ, ఉచ్చాటనానంతరమందు (శాంతియు, తర్పణములుఉండుటనుబట్టి) మృతాశౌచమును పట్టియున్నవి. అందుకే గురుగీతలలో "ఈశ్వరఉవాచ-సప్తకోటిమహామంత్రాః చిత్తవిభ్రమకారకాః। ఏకఏవపరోమంత్రో గురురిత్యక్షరద్వయం॥" అని పార్వతితో చెప్పుటచేత వీటినిఉపాసించువారు చిత్తవిభ్రమకలిగి చెడిపోవుదురు. ఇదిగాక "అహంబ్రహ్మాస్మి" ఇత్యాది మహావాక్యములు ఉపాసించువారికిగూడ జాతాశౌచ మృతాశౌచ దోషంబులు పట్టియున్నవి. ఎందువల్లననగా "అహం" శబ్దమునకు "నేను" అనియర్థము. నేనుఅని యెప్పుడుఅంటే, అప్పుడు

 

జాతాశౌచము. "అస్మి" శబ్దమునకు "అయితిని" అని అర్థము. శబ్దసమాప్తిమృతాశౌచము అనియెరుగవలెను. మంత్రములు అన్నిటికి ఇట్టిఉపద్రవము ఉండుటచే జాతాశౌచ మృతాశౌచములకు ఓం అను ప్రణవబీజము కారణమై యున్నందున వీటిని ఉపాసించుటవల్ల జననమరణ భ్రాంతిపోదు అని సిద్ధాంతపరచిరి. ఈమహాఋషులలో సాందీప మహాఋషి శ్రీకృష్ణమూర్తికి జాతాశౌచ మృతాశౌచములు లేని ద్వాదశాక్షరీ—షోడశాక్షరీ — పంచదశాక్షరీ అనుశ్రుత్యుక్త మంత్రములను ఉపదేశించి జననమరణ భ్రాంతి రహితునిగాజేసెను. ఆమంత్రములే బృహద్వాసిష్ఠ సిద్ధాంతమందు సిద్ధాంతీకరింపబడినవి. ఈమంత్రములకు ఓం అనుప్రణవబీజము లేదు. ఈమూడుమంత్రములకు ఆది,మధ్య అంతము యేమీలేదనే అభిప్రాయముసూచన అగుటచే వీటినివచించగానే వచించినవారు ఎక్కడ, ఏమీ లేకుండ పోవును. ఈమంత్రములు కాక ఇతరమంత్రోపాసనలు ఏమి చేసినను భ్రాంతిరహితములు కావని గ్రహించుకొనవలెను.

## 4. చతుర్థావరణయందుగలభావము

యాజుష-అక్ష్యుపనిషత్తులో "చక్షుష్మతీ సౌరీ విద్యా ప్రస్తూయతే, త్రిగుణాత్మకం హంసాఖ్యం, హిరణ్మయం జ్యోతిస్తత్త్వ ముపాస్యత్వేన విహితమ్॥" అనుటనుబట్టి స్థూల, సూక్ష్మ కారణ మహాకారణసంజ్ఞలకు సరిపోల్చబడి

అన్ని శరీరములయందును ఏచక్షుస్సుగలదో అదే యిచ్చట. చతుర్థావరణగా కనుపర్చ బడెను. ఇదే అంగుష్ఠప్రమాణ ముగల ద్విదళకమలమనికూడ వేదాంతగ్రంథములలో చెప్ప బడినది. శ్రు॥ "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయ-జిహ్వాయా యద్రసం పీత్వాత త్తదాత్మేతి భావయ। యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయ। దేహ జాత్యాదిసంబంధాసర్వాశ్రమసమన్వితా। వేదశాస్త్రపురాణాని పాదపాంసురివత్యజ॥" అన్నందున ఆత్మస్థానరూపకమగునది చక్షుస్సు అనిరి. ఇదే దహరమని కూడ చెప్పబడెను. శు॥ "దహరం విపాపం పరమేశభూతం। యత్పుండరీకం పుర మధ్యసంస్థం। తత్రాపి దహరం। గగనం విశోక స్తస్మిన్ యదంత స్తదుపాసి, దుపాసితవ్యమ్॥" "దహరంనామ అంగుష్ఠ మాత్రమితి శ్రుతేః। ఏతాదృగ్విశిష్టం పుండరీకం। ద్విదళ కమల మధ్యాష్టదళపద్మం। పురమధ్యసంస్థం। త్రిపురమధ్య= (ఎరుపు-తెలుపు-నలుపులను) త్రివిధావరణమధ్య స్థూల, సూక్ష్మకారణ, మధ్యస్థితమితి భావః॥" అని పై త్రివర్ణము లకుసంజ్ఞ లు.

ద్విదళములమధ్యను 'గురు' (గు+రు) అను రెండు బీజాక్షరములు కూడ గలవు. అందు ఊర్ధ్వదళముశాశ్వతాం శముఅధోదళము ప్రకృతి అస్థాంశము అని గుర్తించగవలెను. ఈద్విదళములు ఏకాకారముగనున్న కాలమున ఏమియులేని

ఏకాకారముగానుండెను. తటాలున మెరపుమెరసినట్లు దళములు విడగానే ||శ్లో|| "చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః||" (చెష్మ్‌కె ఖుల్ గయేసో, తబ్ తలక్ నజర్ మే నూర్ ఖఃధాకెథా) అన్నట్లు భూమ్యాది పంచమహాభూతములు అందు చిత్ర విచిత్రములగు వన్నెలతో గూడిన చరాచరరూపకమగు స్వరూపములును ఒక్కముహూర్త కాలములో గోచరమగుచున్నవి. ఇట్లు కొంతతడవు వ్యవహరించి తిరిగి రెండుదళములు ఏకత్వము నొందగానే దృగ్దృశ్యవిహీనమగు పూర్వస్థితిని జెందుచున్నవి. ఈద్విదళముల యొక్క సంయోగవియోగములు 6 పర్యాయములు జరిగిన ఒక్క అరవిఘడియ, అట్టిఅరవిఘడియలు 60 జరిగిన ఒక్క ఘడియ, అట్టిఘడియలు 60 జరిగిన నొక అహోరాత్రమగుననియు, మొత్తము ౨౧౬౦౦ రెప్పపాట్లు దినప్రమాణమని కొందరు గుణించిరి. మరికొందరు శ్వాసలు 6 జరిగిన ఒక అరవిఘడియ, 60 అరవిఘడియలు జరిగిన ఒక్కఘడియ, 60 ఘడియలుజరిగిన నొక అహోరాత్రమగు ననియు, మొత్తము ౨౧౬౦౦ హంస గమనికలు దినప్రమాణమని గుణించిరి.

ఈద్విదళకమల మధ్యను ప్రకృతి పురుషాత్మకమగు (శివశక్త్యాత్మకమగు) 24 తత్త్వసంజ్ఞ కోణములుగల శ్రీచక్రము లిఖింపబడెను. ||శ్లో|| "బిందుత్రికోణవసుకోణదశారయుగ్మం। మన్వస్రనాగదళషోడశపత్రయుగ్మం । వృత్తత్ర

యంచ। ధరణి వదనత్రయంచ। శ్రీచక్రమిదముచ్యతే। వినా బీజాక్షరై రేతత్పూజితం చ ఫలప్రదం॥ శ్రీచక్రం శివశక్తి స్వరూపమితి శ్రుతేః॥" కాన బీజసూన్యమగు శుద్ధచక్రము, చక్రమధ్యమందు కనబడుచున్న రంగులే ద్వాదశకమలము నావరించుకొనియున్న దైవస్వరూపముల యొక్క అంశ సంజ్ఞలు అని యెరుగవలెను శ్లో॥ "విఘ్నేశో రక్తవర్ణశ్చ పాండురః। క్రౌంచారిర్ధూమ్రవర్ణశ్చ సునీలో నందికేశ్వరః। గిరిజా పీతమిత్యాహుః శివో జ్యోతిః ప్రకీర్తితః॥" శ్లో॥ "లక్ష్మణో రక్తవర్ణశ్చ శత్రుఘ్న శ్శ్వేతవర్ణకః। భరతః కృష్ణవర్ణశ్చ, శ్రీరామో నీలవర్ణకః। వైదేహీ పీతవర్ణాస్సి తారకః స్ఫటికాకృతిః॥" శ్రు॥ "నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవభాస్వరా। నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః। స బ్రహ్మా స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్॥" ఈద్వాదశ కమల మధ్య అంతర్బాహ్యంబులకు సూక్ష్మరంధ్రమున్న దనియు, అందు అణుస్వరూపమున్న దనియు శ్రు॥ "అణోరణీయాన్మహతో మహీయానాత్మా గుహాయాం నిహితోఽస్యజంతోః। హిరణ్మయపద శ్రీకోశే నిరంజనం బ్రహ్మ నిష్కళంకం తచ్ఛుభ్రం జ్యోతిః। తద్యదాత్మవిదో విదుః। వామోరంతర్మనసోలింగ మహుః॥" వేమన ॥కం॥ "అణువులోన యుండ నణుబడి బలు నణువు తనమలోన నణంగియుండు॥" అని

యుండుటచే చక్షుర్గోచరముగు బ్రహ్మాండసమితి యీమహాకారణరూపమునకు కలిగినదని నిశ్చయింపక తప్పదు.

శ్రు॥ "యచ్చ కించిజ్జగత్సర్వందృశ్యతే శ్రూయతేఽపివా। తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్॥" అని గానవకాగ్రహింపబడియున్నది. నీలవర్ణ పాపమధ్యకళయే మూలప్రకృతియైన పరమాత్మ రూపుడగు పాపసంభవుడే ఐంద్రజాలకుడు, ఈపాపరహితమే పరిపూర్ణమైనబైలు, అనిగుర్తెరుగవలయునుఅందుకే శ్రు॥ "విపాపం=పాపరహితం=పాతమేశభూతం=పరశ్చపరశివశ్చ. వేశ్మభూతం స్థానభూతమిత్యర్థః తత్రాఽపి హృదయపుండరీక మధ్యే దహరం=సూక్ష్మసుషిరం। విశోకం=దుఃఖరహితం దేహరహితమిత్యర్థః। గగనం=యచ్చిదాకాశం,తస్మిన్=చిదాకాశే,అంతః=మధ్యేయత్పరాకాశం=పరశివ స్వరూపపరాకాశం వర్తతేతత్పరశివస్వరూపం=దృగ్దృశ్యరహితం, గురుకీలకం=పరిపూర్ణం, తస్మైవద్వయదోషరహితార్థముపాసీత॥ "లీలావాక్యము॥ పలుకులకందక। భావింపరాక। తలపున నిలువక తనువున లేక। చూపులకందక। శూన్యమయినట్టి।యాపరతత్వమె।యనువున నెరిగి॥" అని నిర్ణయింప బడినది. గావున ఇదియే ఈచతుర్థావరణయొక్క భావము. గురుమూలంగా దీని నెరుగవలెను.

### 5. చక్రతాత్పర్యార్థ విచారణఫలము.

అష్టదిక్కులయందుగల భావములను విచారించగా శ్లో॥ "అష్టపాశ వినిర్ముక్త మష్టసర్గతం। నిష్టాష్టవిహీనత్వం

శల్లింగం పరమ ప్రభుః॥" అష్టసంజ్ఞ గల మూర్తులు, ఆత్మలు, ఆవరణలు, శూన్యమనే నిష్ఠను పూనవలసినదని చెప్పు చున్నది. కనుక అష్టావరణలలో నున్న భావ మెరుకపరచి నందున నున్నదేమని తెలుచున్నది.

(౧) ద్వాదశి (౨) షోడశి (౩) పంచదశి అను మూడు ఆవరణలయొక్క అర్థము మూడు భాగములుగా జేసి చూచిన యెడల ఒకే అర్థము ఈక్రిందవిధముగా కనబడును.

౧ ౨ ౩

౧ ద్వా॥ వృత్తది—బట్టబయలు—యేమీ లేదు.

౨ షో॥ మూలం లేనిది—గు ర్తెరిగే శరీరం—యేమీ లేదు.

౩ పం॥ కల—దోచిన ప్రపంచం—మేల్కొంటే యేమీ లేదు.

మొదటి మూడు పదముల అర్థమున్ను, కొన మూడు పదముల అర్థమున్ను "యేమీ లేదు" అని తెలుచున్నది. మధ్య మూడు పదములు వున్నటుదోచడమే భ్రమయనిగురు సూచనకలదు. గీతా వాక్యం॥ "అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత। అవ్యక్తనిధానాన్యేవ తత్ర కా పరివేదనా॥" అనుటచే ఆదియందున్ను, అంతమందున్ను, మధ్యను వున్నటు తోచడం భ్రమయేకదా! అందులకే మధ్యదోచినవి చతుర్థ ఆవరణ అనేగు ర్తెరిగే జ్ఞానావరణ—దీనికే బైలనియు. యెరుకని—ప్రపంచమనియు తోచినది. చత్రార్థ ములో గల భావములు తనస్వవిషయమునకే అన్వయించు

కొని శ్రీగురుకృపచే తన మొదలునుగాని, అంతమునుగాని విచారించుకొని యున్నవాడైపోవుచున్నది. కావున చక్రార్థ మంతయు నున్నయనియు దీనిని వ్రాసిన తెలివి యున్న యనియు నెరిగి దీనిని చదివి విమర్శించినవారు నున్నవారై పోవుటయే ఈచక్ర తాత్పర్యార్థ ఫలము.

శ్లో॥ సర్వశూన్యం మాయారూపం జన్మశూన్యంస్వభావతః
పరిపూర్ణం పూర్ణమేవ పూర్ణాచలసముద్రవత్ ॥

కం॥ ఇదిచదివి భావమెరిగెడి సదయులు
పరిపూర్ణ భావసంపన్నతతో।
పదిలంబుగ నుందురనుచు
ఎదనూహతో వ్రాసినాడ నింపుదలిర్పన్ ॥

ఏతత్సర్వం శ్రీనిజగురుచరణారవిందార్పణమస్తు॥

ఇతి

శ్రీమద్గోవిందవజ్ఝల వెంకట్రామాచల గురుస్వాభావులవారి శిష్యుండగు వెంపటి లక్ష్మీనరసింహాముచే వ్రాయబడిన బృహద్వాసిష్ఠ సిద్ధాంత నిస్త్రిగుణ్య ద్వాదశీ-షోడశీ-పంచదశీ చక్రము తాత్పర్యార్థ సహితము సర్వము సంపూర్ణము.

---

# తప్పొప్పుల పట్టిక.

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 3 వ పేజీ 8 వ పంక్తి | నుద్ధరించె | నుద్భవించెను |
| ,, 12 వ ,, | ఒకటుంకేలు | ఒకటుంకెకు |
| ,, 17 వ ,, | సర్వ్యకల్పవలను | సర్వకల్పవలనే |
| 4 వ ,, 11 వ ,, | మహాత్మ్రతె | మహాత్మ్య |
| 6 వ ,, 14 వ ,, | కోణములున్న | కోణముల |
| ,, ,, ,, | బాహుయుగ | బాహుయుగ్మ |
| ,, 20 వ ,, | నాభ్యాసీఅ | నాభ్యాఆసీ |
| 7 వ ,, 1 వ ,, | స్తుతిప్రణమిద్ధిశ | మిద్ధిశ |
| ,, 17 వ ,, | జడరూపమగు | జడరూపకమగు |
| 11 వ ,, 9 వ ,, | పథమం | ప్రథమం |
| ,, 19 వ ,, | కవిగ్రుద్ధున | కవిగ్రుద్ధు |
| 16 వ ,, 7 వ ,, | బాహాణో | బ్రాహ్మణో |
| 19 వ ,, 6 వ ,, | పంచదర | పంచదశ |
| 24 వ ,, 7 వ ,, | — | వీరభద్రశ్చ పాండురః |
| ,, 10 వ ,, | వెదేహో | వైదేహో |
| ,, 20 వ ,, | మంహాః | మాహాః |
| 25 వ ,, 9 వ ,, | పాప | పర |
| ,, 15 వ ,, | ద్బ్యయ | ద్వయ |
| ,, 22 వ ,, | మష్టవర్జితం | మష్టవర్ణవివర్జితం |